

# మా అక్క సుగుణమణి

ఎమ్.ఎస్. రామకృష్ణ రావు

నేనూ మా అక్క, అక్క చెల్లెళ్ళ పిల్లలం. మా పెద్దమ్మకు పది మంది సంతానంలో ఆరుగురు ఆడపిల్లలు, నలుగురు మగపిల్లలు. ఆడపిల్లలలో అగ్రగామి మా అక్క సుగుణమణి. మా పెదనాన్నగారు ఆమెకు ఆ పేరు అంత అతికేటట్లుగా పుట్టిన కొద్దిరోజులకే ఆపేరు ఎలా పెట్టగలిగేరన్నది ఒక అంతుచిక్కని ప్రశ్న. రవీంద్రుని కథలలో ఒక కథ సుభాషిణి అని పేరుగల ఒక మూగ అమ్మాయి - మరవలేని కథ. స్వర్ణలత అనే ఆమె వారపత్రికలలో కథలు వ్రాసేది. బంగారు తీగ అని ఊహించుకుంటూ ఆమె కథలు చదువుతుండేవాడిని. అనుకోకుండా ఒక మిత్రురాలు ద్వారా ఆమె ప్రత్యక్షమయింది. నల్లగా, లావుగా ఆమె ఉండడంతో కథలలో సగం మాధుర్యం ఆవిరి అయిపోయింది. మా అక్క తద్భిన్నంగా సుగుణాలకు మణిపూస. సార్థక నామధేయురాలు.

నాకు 7 - 8 ఏళ్ళ వయసులో ఆమెకు వివాహం అయింది. కొద్దిరోజుల తరువాత నాకు ఒక ఊలు బనీను పోస్టులో వారి బహుమతిగా పంపేరు. రంగులు చూసి మురిసిపోయాను. అది వేసవి కాలం కావడం మూలంగా అమ్మ దానిని పెట్టెలో దాచేసింది. శీతాకాలం రాగానే బయటకు తీసి నాకు వేయడానికి ఉపక్రమించింది. వేసుకుని దానికి గల జేబుల్లో చేతులు పెట్టేను ఉషారుగా. ఏవో కాగితం ముక్కలు తగిలి, చేతులు కిందకు వెళ్ళిపోయా[illegible] నన్ను ఆశ్చర్యానికి గురి చేయాలని జేబుల్లోచాక్లెట్లు పెట్టేరు వారు. వాటికోసం ఎలుకలు కన్నాలు చేశాయి. నా స్వెట్టరుకు కన్నాలు పడినందుకు కొద్దిపాటి విచారం కలిగినా, ఆమె ఎంతోప్రేమతో వాటిని పంపిందన్న భావం నన్ను ఆనంద డోలికలలో ఓలలాడించింది. నాటి నుంచి నేటి వరకు ఎవరు ఏ సందర్భంలో బహుమతులు అందజేసినా ఆ వస్తువు కంటే దానివెనుకనున్న వారి ప్రేమపూరిత హృదయమే నాకు కనబడుతుంది.

ఇది మా అక్క నుండి నేర్చుకున్న మొదటి పాఠం. బహుమతులు అంటే శ్రీ సత్యసాయిబాబాగారి వ్యాఖ్యానం జ్ఞాపకానికి వస్తుంది. ఒక్క "మతి"తోనే ఇన్ని ఇబ్బందులు పడుతున్నాం. ఇక బహుమతులుంటె అంతులేని ఆవేదనలకే అవి దారితీస్తాయి అని.

వారి తరువాత జ్ఞాపకం సామర్లకోట ఫారంలో ఉద్యోగరీత్యా మా బావగారు అందులో గల బంగళాలలో ఉండటం, అది ఇప్పటికి నాకు ఒక సుందర దృశ్యమే. కాలువలు లాకులు, పుష్పవనాలు, పండ్లతోటలు, పక్షులు, అక్క, బావగారు నన్ను వాటి మధ్య తిప్పడం, మొట్టమొదటిసారిగా కాలువలో లాకులు దగ్గర సుడిగుండాలు చూసేను. కాగితం పడవ చేసి నీటిలో వేస్తే, అది క్రమక్రమంగా సుడిగుండంవైపు కదిలి, బలవంతంగా ఎవరో లోపల నుండి లాగేసినట్లు, చటుక్కున కాగితం పడవ మునిగిపోయేది. కాసేపటికి రెండవ వైపు చూస్తే

పిల్లకాలువలో నలిగిపోయి, చినిగిపోయి కనిపించేది. అందమైన జీవితం కూడా సమస్యల సుడిగుండంలో పడితే ఇలా కకావికలైపోవడం మనకు నిత్యానుభవం.

వయసులో ఎంతో తేడా వున్నా బావగారు ఆ పూల గురించి, ఫలాలు గురించి ఎన్నో విషయాలు నాకు అర్థం అయ్యేటట్లు బోధించేవారు. వారు నడుపుతున్న ప్రభుత్వ పత్రికలు చూపించేవారు. అన్నీ వ్యవసాయానికి సంబంధించినవే అయినా, అందులో ఒక వాక్యం నాకు బాగా జ్ఞాపకం ఉండిపోయింది. కృషితో నాస్తి దుర్భిక్షం, జపతో నాస్తిపాతకం అని. ఆయన రెండింటిని సాధించిన మహామనీషి. ఆ దంపతులు అరకులో ఉన్నప్పుడు చలికాలంలో రాగి బిందెతో నీళ్ళు రాత్రి ఆరు బయట ఉంచి, తెల్లవారు ఝామున ఆ నీటితో స్నానంచేసి, నిశ్చలంగా జపానికుపక్రమించేవారు. అరకులోయ అభివృద్ధికి ఆయన చేసిన కృషి ఎంతచెప్పినా తరగదు.

కోయవాళ్ళ జీవనవిధానం, సంతలు, సెలయేళ్ళు అన్నీ తిప్పేవారు. మూడు పెద్ద గుడిసెలలో వీరిది ఒకటి. ఇంకొక పెద్ద గుడిసెలో డాక్టరుగారు, వేరొకదానిలో రెవెన్యూ అధికారి (ఆర్.డి.వో.). జలవిద్యుత్ ప్రాజెక్టు రావడంతో రోడ్లు, బస్సులు తరువాతి కాలంలో రైళ్ళు ఇలా పెరిగి ఇప్పుడు ఆంధ్రదేశంలోనే ఒక ప్రముఖ పర్యాటక కేంద్రంగా మారింది. శ్రీ శొంఠి రామమూర్తి గారితో కలిసి మా బావగారు చేసిన కృషి దీనంతటికీ పునాదిరాయి. నేను విడిపోయేటప్పుడు అది ఇల్లు అయినా, రైల్వే కంపార్టుమెంటు అయినా సరే బావగారు మా అమ్మకు పాద నమస్కారం చేయడం, పెద్దలయెడల మనం నడచుకోవాల్సిన విధానం చెప్పడం ద్వారా కాకుండా, ప్రత్యక్షంగా చేసి చూపించి నేర్పించిన మహావ్యక్తి!

ఇప్పటితరంవారికి అదొక పెద్ద విషయంగా కనబడకపోవచ్చు. కాని పెద్దమనిషి అయిన తరువాత ఇంట్లో కూర్చొ బెట్టి చదువు మాన్పించే రోజులలో మా పెద్ద నాన్నగారు మా అక్కను

కాలేజి చదువులకు పంపడం, స్త్రీ విద్యకు బాటలు వేసిన వారిలో ఒకరని చెప్పక తప్పదు. ఆయన ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిన పిఠాపురాధీశ్వరుని అనాథాశ్రమంలో అందరి పిల్లలను సొంత పిల్లలుగా పెంచి విద్యాబుద్ధులు గరిపి, పెళ్ళిళ్ళు చేసి వారున్న గ్రామాలకు వెళ్ళినప్పుడు తప్పనిసరిగా వారిళ్ళకు వెళ్ళి యోగక్షేమాలరసి వారిని "నాకు ఎవరూ లేరు, నేను అనాథను" అనే భావం లేకుండా చేసేవారు. ఆయన దీనినంతా ఒక యోగంగా చేసేవారు తప్ప, జీతభత్యాలకోసం కాదన్నది సుస్పష్టం.

రెండవ ప్రపంచయుద్ధరోజులు. జపాన్‌వారు విశాఖను, కాకినాడను ఒకే రోజున బాంబుల దాడికి గురి చేశారు. అందరూ తలోదిక్కుకు పారిపోయారు. మా పెదనాన్నగారి కుటుంబం కాకినాడ వదలి తూర్పుగోదావరి జిల్లాలో మేముంటున్న రాజోలు గ్రామానికి వచ్చి కొన్ని నెలలున్నారు. అప్పుడే అనుకుంటా మా అక్కను ఎవరో అడిగారు. "మీకూ

ఆయనకు సంబంధం ఎలా కుదిరింది?" అని.
ఇద్దరు ఆదర్శవాదులు. మా అక్క కాలేజీలో
చదివిందని చుట్టుప్రక్కల వారందరికీ దేవలోకం
నుండి వచ్చిన దేవకన్య. అప్పుడు మా అక్క
చెప్పింది - మా బావగారు ఆదర్శవంతమైన స్త్రీ
ఎలావుండాలి? అని పెళ్ళి చూపుల్లో అడిగారట.
వెంటనే మా అక్క తడుముకోకుండా —

ధర్మార్థ కామ సాధనకుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము
విమల చారిత్ర శిక్షకాచార్యకంబు
అన్వయస్థితికి మూలంబు, సద్గతికి ఊత
గౌరవంబున కేకకారణంబు
ఉన్నతస్థిరగుణములకాకరంబు,
హృదయ సంతోషమునకు సంజనకంబు
భార్యయె చూవె, భర్తకు ॥

అని కాళిదాసు శాకుంతలకు తెలుగు అనువాదం
అయిన ఒక నాటకంలో పద్యం చదివి వినిపించింది.

అది విన్నవారు ఎవరు మాత్రం ముగ్ధులు కాకుండా ఉంటారు! వెంటనే కట్న కానుకలు ఏమీ తీసుకోనని పెళ్ళికి అంగీకారం తెలిపారు. ఇదే పద్యం శ్రీ భగవాన్ సత్యసాయిబాబాగారు స్త్రీ ధర్మప్రబోధంలో ఉదాహరించారు. వరా బావగారి పేరు భూషణంగారు. పెళ్ళితో వారిద్దరూ "సుగుణభూషణు"లయ్యారు.

ఢిల్లీలో పనిచేసే రోజుల్లో శ్రీవంతి దుర్గాబాయిగారితో పరిచయం తరువాత సాన్నిహిత్యం, గాంధీ గారితో గడిపే అవకాశం వచ్చింది. దుర్గాబాయిగారితో కలిసి అవిభక్త మద్రాసు రాష్ట్రంలో "ఆంధ్రమహిళాసభ"ను స్థాపించడం, అది శుక్లపక్షంలో చంద్రుడిలా దినదినాభివృద్ధి గాంచి వందలాది వంచిత మహిళలకు నీడగా నిలిచింది. దేశ్‌ముఖ్‌గారితో దుర్గాబాయిగారి వివాహానంతరం ఆయన పరిచయబాంధవ్యం కూడా పుష్కలంగా లభించింది. దానితో వారి సేవాకార్యక్రమాలు

మరింతగా విజృంభించాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి హైదరాబాదుకు అంతా మారడం జరిగింది. వెంటనే అక్కడ కూడా ఒక ఆంధ్రమహిళాసభ ఏర్పరచి శాఖోపశాఖలుగా దానిని అభివృద్ధి పరచడం జగద్విఖ్యాతం. బావగారు వ్యవసాయ రంగంలో ఉన్నత పదవులలంకరించారు.

1958లో జరిగిన ఒక సంఘటన చిరస్మరణీయం. నా శ్రీమతి డా॥ సన్యాసమ్మ ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆధ్వర్యాన సికిందరాబాద్‌లో ఒక నెల రోజులు పెర్సీస్ హోటలులో ఉండవలసి వచ్చింది. ఆ రోజులలో దానిలో గదికి అద్దె రోజుకు రూ.600/- చెల్లించాలి. మా నెలసరి జీతం రూ. 200/-+ కరువు భత్యం రూ. 43/- సామాన్యులకు అందులో ప్రవేశం లేదు. మా బావగారు మా ఆవిడను పలుకరించాలని ఆ హోటలుకు వెళ్ళారు ఒక కాకీ నిక్కరు, చొక్కాతో. గేటు దగ్గర కాపలాదారు లోనికి వెళ్ళనీయలేదు. ఆయన వ్యవసాయశాఖ డైరెక్టరు అని చెప్పిన

తరువాత లోనికి పంపేడు. సాదరపూర్వక అతిథి సత్కారాలు జరిగిన తరువాత ఈ అన్నయ్య గారు చెల్లెలుతో జరిగిన విషయం చెప్పారు. మరి మీరు సూటు మానేసి ఈ వేషధారణలో ఎందుకు తిరగాలి .అని ఆమె ప్రశ్న. ఇంకొంచెం సేపటిలో నేను క్యాంపుకు వెళ్ళాలి. దారిలో అన్నీ పొలాలు ఇప్పుడిప్పుడే మన రాష్ట్రంలో ట్రాక్టర్లు వాడకంలోకి వస్తున్నాయి. ఎవరైనా వానితో దున్నుతూ ఇబ్బందులలో పడితే సూటుతో ఉండి చూస్తూ వెళ్ళిపోవడం నాకు ఇష్టం లేదు. ఈ నిక్కరు చెప్పులతో ఉంటే వెంటనే జీపు దిగి సంకోచంలేకుండా బురదలోకి దిగి కష్టంలో ఉన్న వ్యక్తికి సాయం చేయడానికి వీలవుతుంది. అందుకే ఈ "వస్త్రధారణ" అన్నారు. ఆయన పరోపకార బుద్ధికి, ముందు చూపుకు ముగ్ధురాలైపోయి, జీవితాంతం ఆయనకు భక్తురాలిగా మారిపోయింది మా ఆవిడ. అటువంటి ఆదర్శవాదులు, కాదు కాదు ఆదర్శ పురుషులు ఈ రోజుల్లో ఉన్నారా? అని ఆలోచిస్తే అది శేషప్రశ్నే అవుతుంది.

ఆయన ఏలూరులో జిల్లా అధికారిగా పనిచేసేరోజుల్లో మేము తణుకులో ఉండే వాళ్ళం. ఒక రోజున అధికారపర్యటనలో భాగంగా తణుకు వచ్చి, మా ఇంటికి వచ్చేరు. కాలేజీకి సెలవలు అవడంతో నేను కూడా రాజమండ్రి నుంచి ఇంటికి వచ్చి ఉన్నాను. జీపు డ్రయివరు మా బావగారి బ్యాగ్ బండిలో నుంచి దించి ఇంట్లో పెట్టేడు. జేబులోనించి ఒక బేడ తీసి డ్రైవరుకు ఇచ్చేరు. అణాలు, బేడలు అని నయా పైసలకు పూర్వం ఉండేవి. నేను ప్రశ్నార్థకంగా మా బావగారివైపు చూసేను. ఇది నా సొంత పని. అధికార పర్యటనలో భాగం కాదు. అందుకే ఆ సేవకు మూల్యం చెల్లించేను అన్నారు బావగారు. అవాక్కుఅవడం నా వంతయింది. ప్రభుత్వ పని, సొంతపని అని ఆ రకంగా విడదీసి చూడటం ఆయనకే చెల్లింది. నేటి తరంవారు గన్‌మెన్‌లను సొంత నౌకర్లు లాగ వాడుకోవడం చూస్తే ఆయన ఏమయ్యేవారో!

హైదరాబాద్‌లో ఎప్పుడు మా అక్కింటికి వెళ్ళినా అది ఒక ఋష్యాశ్రమంలా ఉండేది. మా బావగారు రాష్ట్రస్థాయి అధికారి అయినా, ఇంట్లో ఒక్క కుర్చీ కూడా ఉండేది కాదు. అంతా కృష్ణాజనాలు, తివాసీలు, కాంగ్రెస్ కార్యవర్గ సమావేశాలలోలా ఆనుకోటానికి దిళ్ళు, నేత చీరతో తెల్లని రంగులో పచ్చటి మా అక్క. అంతకుముందు స్వయంగా వడికిన నూలుతోనే చీరలు నేయించేదనుకుంటా. నూలు వడకడం మానివేసినట్లుంది. ఖాదీ భండాగార్‌లోనే కొని స్వదేశ వస్త్ర ధారణ. కాఫీ, టీలకు బదులుగా వారింట్లో తయారుచేసిన ప్రత్యేక పళ్ళరసాలు ఒక ప్రత్యేకత. ఇక వారి వాహనం ఢిల్లీలో కొనుక్కొని వచ్చేరు. ఇటలీలో తయారైన అది ఒక త్రిచక్ర వాహనం. ఇంచుమించుగా ఇప్పటి ఆటోల మాదిరిగా ఉండేది. హైదరాబాద్ - సికిందరాబాద్‌లలో మరొకటి అటువంటిది లేదు. అంతా వింతగా చూసేవారు అందులో

ప్రయాణంచేస్తుంటే. గాంధీగారితో ప్రత్యక్షంగా గడిపే అవకాశం లేకపోయినా, ఆ వాతావరణం ప్రస్ఫుటంగా కనిపించేది.

ఒకసారి సభనుంచి అంటే ఆంధ్రమహిళాసభ అన్న మాట. దానిని సంక్షిప్తంగా సభ అనడం అలవాటయింది. సభనుంచి ఇంటికి అక్కా నేను కారులో వస్తున్నాం. దారిలో హఠాత్తుగా దిగమంది. ఎందుకో అర్థం కాలేదు. డ్రైవరును కారును సభకు తీసుకుపొమ్మన్నది. నన్ను నడవమన్నది. ఇంకా విషయం స్పష్టం కాలేదు. ఒక ఫర్లాంగు దూరంలో కాయగూరలు కొనుక్కొని ఇంటికి నడచివెళ్ళాం. ఆ సంచీని మోసుకొంటూ అప్పుడు వివరించింది మా అక్క. ఇది సభకు ఇంటికి దారిలో లేదు కదా! దారి మళ్ళించి, సొంత పనుల కోసం సభ కారును వాడుకోవడం నాకిష్టంలేదు అన్నది. కాయగూరలతో సంచిమోస్తున్నానేమో ఆ ఉక్రోషంలో "మరీ ఇంత కఠినంగా రూల్సును అమలుచేయడం బాగాలేదు" అని అందామను కొన్నాను కాని ధైర్యం చాలలేదు.

కాలక్రమేణా మద్రాసులోనూ, హైదరాబాద్ లోనూ ఆంధ్రమహిళాసభ శాఖోపశాఖలుగా విస్తరించి ఆ రెండింటికి మా అక్క అధ్యక్షురాల యింది. 300 పడకల ఆసుపత్రి నిర్వహణే నాకు ఎంతో సంక్లిష్టంగా ఉండేది. అలాంటిది ఒక్క హైదరాబాద్‌లోనే సభ ఆసుపత్రిలో హృద్రోగుల శస్త్రచికిత్సలు ప్రారంభించడం ఒక సాహసోపేత చర్య. దీనికి తోడుగా నర్సుల శిక్షణ, స్త్రీలకు వృత్తి విద్యలలో నైపుణ్యం కలగచేయడం, బదిర మూగ పిల్లలకు ప్రత్యేక ఆసుపత్రి - ఇలా విస్తరించుకుంటూ పోయింది. ఆరోజుల్లో గుండె ఆపరేషన్లు మొదలు పెట్టింది హైదరాబాద్‌లో ఇక్కడేననుకుంటా. దేశ్‌ముఖ్‌గారికి ఉచితంగా గుండె ఆపరేషను చేయమని కేంద్రప్రభుత్వం నుంచి ఒక సిఫారస్‌తో బొంబాయిలో ఆపరేషన్ జరిగింది. ఆసుపత్రి వర్గాలు చివరి రోజున రూ. 27000/- బిల్లు ఇచ్చేరు. ఆపరేషను ఖర్చులు, డాక్టర్ల ఫీజులు వగైరా అంతా ఉచితమే. ఇవి ఇతర చిల్లరమల్లర

ఖర్చులు మాత్రమే అన్నారు. ఈ లెక్కన సామాన్యమానవుడిగతి ఏమిటని అంతర్జాతీయ సంస్థల సహకారంతో ఈమె, దుర్గాబాయిగారు ఈ విభాగాన్ని ఏర్పాటుచేసి, గుండె ఆపరేషన్లు చేసే నిపుణులు దొరకని రోజుల్లో వారు వచ్చే ఏర్పాట్లు చేసి దిగ్విజయంగా దానిని నెరవేర్చేరు. చివరకు సుగుణమణి గారే సభ. సభే సుగుణమణిగారు అన్న స్థితికి వచ్చింది.

మా అక్క బావలకు మహాలక్ష్మమ్మగారనే ఒక గురువుగారున్నారు. నేనామెను నా 10వ ఏట భద్రాచలంలో చూసేను. అంబాసత్రం పేరుతో శ్రీరామభక్తుల ఆలనా పాలనా చూసేవారు. ఇప్పటి మాదిరిగా వసతులు ఏమాత్రం లేని ఆ రోజులలో యాత్రికులకు ఆ కొండలలో ఆమె అండగా నిలవడమేకాక కాశీ అన్నపూర్ణలా అన్నదానం చేసేవారు. వారు మాత్రం తినేది 5, 6 వేప చిగుళ్ళు, నిమ్మకాయంత అన్నం. అన్నీ ఆసనాలు వెయ్యడమే కాక నేతి, దౌతి వంటి ప్రక్రియలు

నిర్వహించేరు. 95వ ఏటకూడా ఆమెకు వార్ధక్య చిహ్నాలు ఏమీలేకపోగా, అద్భుతమైన జ్ఞాపకశక్తితో అలరారేరు. మనిషి సామాన్యంగా కనిపించినా ఆధ్యాత్మ చర్చ మొదలుపెడితే ఆవిడ జీవన్ముక్తురాలు అని కొద్దిసేపట్లోనే గ్రహించుతాము. సామాన్యులు కొలిచే డిగ్రీలు ఆమెకు లేకపోయినా, భగవదనుభూతి నిచ్చేదే నిజమైన విద్య అనే నిర్వచనం అన్వయిస్తే, ఆమెకు మించిన పండితులు బహు కొద్దిమందే అని చెప్పాలి. ఈ భావంతోనే వేదాలను కూడా అవిద్య కింద కొందరు మహనీయులు జమకట్టేరు. అంత కొద్ది ఆహారం తింటూ అంత శక్తితో భౌతిక కార్యాలను ఎలా నిర్వహిస్తున్నారనేది వైద్య శాస్త్రానికే అందని ప్రశ్న. అటువంటి గురువు వద్ద సుశిక్షితులైన మా అక్క, బావలను తయారు చేయడమే కాకుండా మా అందరి యోగక్షేమాలు విచారించేవారు. అటువంటి వారి తపస్సు మూలంగానే ప్రపంచంలో ఈ మాత్రమైనా శాంతి మిగిలి ఉందంటే అతిశయోక్తి కాదు!

ఎందరో అభాగినులను ఆదుకొన్న మా అక్క న్యాయ సూత్రాలను ఏ మాత్రం అతిక్రమించేది కాదు. పురుషాధిక్యత గల ఈ ప్రపంచంలో అనాదిగా ఆడదానికి అన్యాయం జరుగుతూనే ఉన్నది. ఆమె సేవాసదన్‌లో ఎక్కువ మంది అటువంటి వారే. మిగిలిన వారు చేజేతులా కష్టాలు కొని తెచ్చుకొన్న వారు. సుఖసంతోషాలతో నిండిన సంసారాలను వదలి భర్త, పిల్లలను అలక్ష్యంచేసి, ఇతర వ్యామోహాలకు లోనై లేవదీసుకొని వచ్చిన వాడు నట్టేట్లో ముంచితే తిండికి గుడ్డకూ కరువై, శరీరం రోగాల మయమయినవారు కూడా సేవాసదన్‌లో చేర్చుకోబడ్డారు. వారిని ఓరిమితో మందలించి, ఆశ్రయమిచ్చి, జీవనాధారవృత్తులలో శిక్షణ ఇచ్చి మళ్ళీ వారిని సన్మార్గంలో పెట్టడం నేను గమనించేను. దీనికి ఎంతో ఓర్పు, నేర్పు కావాలని వేరే చెప్పనక్కరలేదు. తోటి స్త్రీ అని వారి తప్పులను ఏనాడూ సమర్థించలేదు. ఆదరించడం మానలేదు. ఇదీ ఆమెలో నేను

గమనించిన ప్రత్యేకత. ఈ రెండవ కోవకు ప్రతీక విశ్వనాథవారి "చెలియలికట్ట"లో నాయిక రత్నావళి.

మా చిన్నక్క అరవిందకు ఎప్పుడూ ఒక సందేహం "ఇంత మంది జీవితాలను చక్కదిద్ది, స్త్రీ జనాభ్యుదయానికి జీవితాన్ని ధారపోసిన మా అక్క ఎప్పుడూ పూజలు, పునస్కారాలు; గుళ్ళు, గోపురాలు; దర్శించడానికి ఆసక్తి ఎందుకు చూపదు" అని. నీది స్వార్థ భక్తి, అక్కది నిస్వార్థమైన విశ్వరూప ఆరాధన అని నా సమాధానం. ప్రార్థించే పెదవులకన్న సేవనందించే హస్తాలు మిన్న అన్న వివేకానందుని సూక్తిని జ్ఞాపకం చేసేను. నిస్వార్థంగా సేవ చేసే సంఘ సేవకులు చాలా మందే ఉన్నారు దేశంలో. కాని జీవితాన్నంతా ఆదర్శానికే అంకితం చేసి, రాత్రనక పగలనక, ఎండనక వాననక ఆ సేవాభావంతో మెలిగే మదర్‌థెరిస్సా వంటి వారు అరుదుగా కన్పిస్తారు. అటువంటి అపురూప వ్యక్తుల కోవలోకి మా అక్క వస్తుందంటే అతిశయోక్తికాదు. రాష్ట్రపతి నుంచి రాష్ట్ర, జిల్లా, పట్టణాలలో అనేక

సత్కారాలు అందుకొన్న ఆమె, తన వందలాది వ్యాసాల ద్వారా ఎంతోమందిని ఉత్తేజపరచి సంఘ సేవకులను తయారు చేసింది. రేడియో, టి.వి. ప్రసంగాల ద్వారా తన సందేశాన్ని లక్షలాది ప్రజలకు వినిపించింది. ఎన్నో సంస్థలు ఆమెను సత్కరించి తమ ఉనికిని చాటుకొని తరించేయి.

84 ఏళ్ళు వచ్చినా నిత్యం సకాలంలో సభకు వెళ్ళి కార్యనిర్వాహక పనులు చేబడుతున్నది. వేలాది రూపాయలు జీతం తీసుకొని, అసలు ఆఫీసులు, విశ్వవిద్యాలయాలలో నామ మాత్రంగా ముఖం చూపించి ఇతర ఆర్థిక లావాదేవీలు నిర్వహిస్తున్న ఈ రోజులలో, ఆమె కర్తవ్య నిర్వహణ శ్లాఘించకుండా ఉండలేము. ఆవిడ కంటె ఒక పుష్కరం వయస్సులో చిన్నవాడినైనా నేను శ్రీ సత్యసాయి సేవా సంస్థలలో వైద్య సేవలందిస్తూ, ఏ రోజునైనా 200 కి.మీ. ప్రయాణం చేసి, మూరు మూలలలో ఉన్న గిరిజనులను 200 మందికి వైద్యసేవలందించి,

మళ్ళీ అదే రోజున ఇంకొక 50 మంది రోగులను చూడవలసి వస్తే, ఈ మధ్యన అలసట అనిపిస్తున్నది. వెంటనే మా అక్క సేవానిరతిని తలచుకొంటె, ఎక్కడి నుంచో శక్తి వచ్చి, ఆ స్ఫూర్తితో ఆ రోగులను పరీక్షించి మందు లివ్వటం జరుగుతుంది. ఆ విధంగా ఆమెనుండి ఆ స్ఫూర్తి నందుకొంటూ ఆవిడను అక్కగా పొందటం నా పూర్వ జన్మ పుణ్యం అని భావిస్తాను.

***

మాన్య సౌజన్య సౌహార్ద్ర మానసమ్ము
గణ్యమానవత్వ మహిత గౌరవమ్ము
పుణ్యసేవాంకిత గుణవిభూషితమ్ము
ధన్య చరిత సుగుణమణీ జీవితమ్ము

అభివందనాభినందనలతో

*డా॥ నిడమర్తి నిర్మలాదేవి*


సర్వా శారద

# 'సుజన జీవని' సుగుణమణి

శ్రీమతి "సుగుణమణి" "సుగుణ భూషి". అన్వర్థ నామధేయురాలు. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. నీ సహచరులు, సాంగత్యాభిలాషులను బట్టి నీ గురించి తెలుసుకోగలను. ఈ శతాబ్దములో మొదటి రెండు దశకాల సాంఘిక రాజకీయ నైతిక సాంస్కృతిక వాతావరణం, ఆనాటి కుటుంబాలు ముఖ్యంగా మధ్య తరగతి వారి కుటుంబాలు విద్యాలయాలు సమాజ వ్యవస్థ - సంఘ సంస్కరణాభిలాషులకు చాల దోహదకారిగా నిస్వార్థ సేవకు నివాళులర్పించేదిగా ఉండేది. అందుకే ఆనాటి వారందరు స్వచ్ఛంద సేవకు అంకితమైనవారే. అందులో మన సుగుణమణి - సంఘ సంస్కర్తల కుటుంబంలో జన్మించింది. తండ్రి ఆనాడే హరిజనుల (అంత్యజులనబడే వారికి) శరణాలయం నడుపుతూ కుటుంబ

సభ్యులందరికి సేవాభిలాష పెంపొందించారు. సహజంగా సుగుణమణిగారి అప్పచెల్లెళ్ళు అన్నదమ్ములు చాల సంస్కారవంతులు, సహృదయులు. దానికి తోడు ఆనాడే పేరు గడించిన బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు ప్రబోధకులుగా పనిచేస్తున్న కాకినాడ పి. ఆర్. కాలేజీలో విద్యనభ్యసించారు.

బంగారానికి తావి అబ్బినట్లు ఆమెకు భూషణంగారితో వివాహం దైవ నిర్ణయం. ఆయన శుద్ధ సాత్వికులు గాంధేయులు.

1942 - 43లోనే మన దుర్గాబాయిగారితో సాహచర్యం లభించడం అంటే 20, 22 ఏళ్ళకే నిస్వార్థంగా సేవ చేయాలన్న అభిలాష కల్గిందామెకు. దానికి ప్రధాన కారణం ఆమెకు అవసరాల పట్ల తప్ప సౌకర్యాలు, విలాసాలపట్ల మోజు లేకపోవటమే. నిరాడంబరత ఆమె అలంకారం. అందుకే నాకేం కావాలి? భగవంతుడు కూడు, గుడ్డ, గూడుకు లోపం చేయలేదు. నాకింకేంకావాలి? అనే

మనస్తత్వంతో ఆ యువతి దుర్గాబాయి గారి దగ్గరకు వెళ్ళి నాకు ఏదైనా సేవా కార్యక్రమాన్ని సెలవీయండి. ఏ ప్రతిఫలాన్ని ఆశించకుండా యథాశక్తి సేవ చేస్తాను అనగానే దుర్గాబాయిగారు పొంగిపోయారు. నాకు యిటువంటి మణులు భూషణాలు కొద్ది మంది ఉంటే చాలు స్వచ్ఛంద సేవా సామ్రాజ్యాన్ని సమర్థంగా నిర్వహించగలను అన్నారు. అంతే అప్పటి నుంచి అర్ధశతాబ్దం పైగా సహజ నైర్మల్యంతో ఏ ప్రతిఫలం గుర్తింపు ఆశించకుండా యిటు ఆంధ్రమహిళాసభకు అటు ఆంధ్ర బాలానందానికి స్త్రీ, శిశు సంక్షేమానికి అంకితమయ్యారు. ప్యూన్ నుంచి ప్రెసిడెంట్ వరకు అన్ని బాధ్యతలు - మన దుర్గాబాయిగారి లాగా నిర్వహిస్తూనే వున్నారు. పని ఎటువంటిది అని కాదు ప్రశ్న, అది చక్కగా జరగాలన్నదే ముఖ్యం. ఇతరుల మీద ఆధారపడితే స్వచ్ఛంద సేవ ఎందుకవుతుంది? ఎవరో చెప్పాలని, ఎదురుచూడటం ఎందుకు? ఎక్కడ ఎప్పుడు ఎవరికి మన సేవలు ఏ రూపంలో

అవసరమో వాటిని పది మందిని కూడగట్టుకుని చేసుకుంటూ పోవటమే. ఇదే అమ్మానాన్నలు ఆచార్యులు స్నేహితులు నేర్పిన పాఠం.

అందుకే భర్తతో ఏ ప్రదేశానికి వెళ్ళినా ముఖ్యంగా అరకువాలీలో ఆటవిక జాతివారికి ఆమె చేసిన సేవలు చిరస్మరణీయాలు. ఇప్పుడు ప్రభుత్వం అందించాలని తాపత్రయపడుతున్న ఉపాధి కల్పించటం, సాక్షరత, హాస్టలు నిర్వహించటం మొదలైన సేవలన్నింటికి ఆనాడే పునాదులు వేశారామె.

స్వచ్ఛంద సేవాసంస్థలలో అజాతశత్రువుగా అర్థ శతాబ్దానికి పైగా తన అంతఃకరణ సాక్షిగా సేవలందిస్తున్న అద్వితీయ ఆంధ్ర మహిళ బహుశః సుగుణమణిగారే. ముఖ్యంగా ఆంధ్ర మహిళా సభవారి 55 సేవలను అందుకుంటున్న ప్రతి లబ్ధిదారు తప్పక సుగుణమణి గారిని స్వయంగా ఎరిగిన వారే అంటే అతిశయోక్తి కాదు. అందులో సేవలందిస్తున్న ప్రతి ఒక్కరు ఇలా ఆమెకు

అందరూ సన్నిహితులే. ఇలా ప్రతి ఒక్కరితో తాను తాదాత్మ్యభావంతో మెలగటం బహుశః సౌజన్యశీలి అయిన సుగుణమణిగారికే సాధ్యమేమో అనిపిస్తుంది. అందుకే ఆమె సుజనజీవని సుగుణభూషణి.

ఆనాడు 1944లో ఆంధ్రమహిళాసభ ఆధ్వర్యంలో వెలువడిన మొట్టమొదటి స్వచ్ఛంద సేవా సంస్థ సేవికలు వెలువరించిన మాసపత్రిక "ఆంధ్రమహిళ" లో వ్యాసాలు వ్రాయటం దగ్గర నుంచి ప్రూఫులు దిద్దటం, స్టాంపులు అంటించి నడిచి వెళ్ళి పోస్టు చెయ్యటం వరకు అన్ని బాధ్యతలు సుగుణమణిగారే. అలా మొదలైన సేవ యింతింతై మహిళాసభ శాఖోపశాఖలుగా విస్తరిస్తూ పోతుంటే కొన్ని శాఖలకు కార్యదర్శిగాను, సలహాదారుగాను సేవచేస్తూ ధర్మకర్త ట్రస్టీ అయి, 6 ఏండ్లు అధ్యక్షురాలుగా ఎంతో సమర్థంగా ఆ పదవి నిర్వహించారు. ఆమె యీ సంస్థ కోసం ఎన్నో నిధులు లక్షలలో సేకరించారు. ఆస్తిపాస్తులను

సమంకూరార్చారు. స్వచ్ఛంద సేవికలకు మార్గదర్శకమై వారిని తీర్చిదిద్దారు.

ప్రతిఫలం ఆశించకపోయినా - "తల్లికి తగ్గ తనయ" దుర్గాబాయి ప్రతినిధి - వీరిని చూస్తే దుర్గాబాయిగారిని చూచినట్లే అనిపించుకున్నారు. ఆమె లాగానే ఎన్నో రాష్ట్రీయ, జాతీయ అవార్డులు, గుర్తింపు పొందారు. అభినందన పరంపరలు అందుకున్నారు. అపరదుర్గాబాయి అనిపించు కున్నారు. ఆమెని చూచిన వారెవ్వరూ ఆమె యింత మహోన్నత వ్యక్తి అనుకోరు. అంత నిగర్వి. అంత సీదా సాదాగా వుంటారు. దుర్గాబాయి జీవితపు విలువలను పుణికిపుచ్చుకున్నారు. ఆమె Philosophical or spiritual out look అటువంటిది.

1944 నుంచి అటు ఆల్ ఇండియా రేడియోలోను యిటు టివి వచ్చినప్పటి నుంచి ఎన్నో స్త్రీల సమస్యల గూర్చి తన నిశ్చితా భిప్రాయాలను నిర్భితితో వెలిబుచ్చుతూనే వున్నారు. వివిధ అంశాల మీద ముఖ్యంగా స్త్రీ

శిశు వృద్ధుల సమస్య పరిష్కారమార్గాలను సూచిస్తూ ఎన్నో పత్రికలకు, వార్తాపత్రికలకు ఆమె వ్యాసాలు అందించారు. ఇంకా అందిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వ కమిటీలలో ఆమె సభ్యురాలు. విద్యావిషయిక కమిటీలో ఆమె సలహాదారు.

రూపుదాల్చిన "సహజీవనం" సుగుణమణి. మృదుభాషి మధురభాషి, పూర్వభాషి. అందరి క్షేమ సమాచారం తానే కనుక్కుంటూ వుంటారు. స్వచ్ఛంద సేవికలకు మార్గదర్శిని.

స్త్రీలకు ఆమె యిచ్చే సలహా Women's lib పేరిట confrontationకు, competitionకు, comparisonకు సంసిద్ధులుకారాదు. ఆ పద్ధతి మన సమస్యలకు పరిష్కారం కాదు. స్త్రీ పురుషులు పరస్పర పూరకాలు complementary to each other. అభిన్నులు. సరిసమానులు. చెట్టు వేరు రూట్స్ వేరు కాదు. భిన్నం కాదు. కాకపోతే బాధ్యతానిర్వహణలో బరువు బాధ్యతలు వృక్షానికన్నా వృక్షపు వేరు అందునా మదర్ రూట్‌కే

ఎక్కువ ఉన్నట్లు స్త్రీకి యిటు కుటుంబంలో అటు సమాజంలో బరువూ బాధ్యతలు ఎక్కువ. వేళ్లు ఎలాగయితే తనను తాను రక్షించుకుంటూ కాండాన్ని దృఢం చేస్తాయో అలాగే స్త్రీ మాతృమూర్తిగా తనను తాను ఆదర్శవంతంగా చేసుకుంటూ తన సృష్టి అయిన మానవాళిని మంచి మార్గంలో పెట్టే ప్రయత్నం చేస్తుంది, చేయాలి. తన చిన్న పాత్రల ద్వారా పురుషుని యోగ్యునిగా తీర్చి దిద్దాల్సిన కర్తవ్యం స్త్రీల మీదే వుంది. అందుకే పురుషుడు తనకు అన్యాయం చేస్తున్నాడన్నా, అణగదొక్కుతున్నాడన్నా పురుషాధిక్య సమాజం exploit చేస్తున్నారన్నా దాంతో సుగుణమణిగారు ఏకీభవించరు. ఏ రూపంలోనైనా వంగవాడు స్త్రీచేత మలచబడవలసిన వాడే, మలచబడేవాడే. అందుకే గురుతర బాధ్యత స్త్రీలదే అంటారామె. దుర్గాబాయిగారు మీ కందించిన వారసత్వమిదే ఆత్మగౌరవం, ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం.

ఎవరికి వారు అలవరచుకునేవే గాని ఒకరు యిచ్చేవి ఇవి కావు. ఆత్మ న్యూనత తగదు. సబలలమై వుండి కూడా మనలను మనమే అబలలం అనుకుంటే ఎలా? అని అంటారామె. కాసారము నీరు కోరుననే సామెత విడ్డూరం. తనలోనే నిక్షిప్తమైన శక్తి యుక్తుల్ని తానే గ్రహించి సమయానుకూలంగా వినియోగించుకోవాలని అంటారు. "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని కదా నానుడి. ఆమె నిరంతర సాధనతో సౌజన్యంతో సాత్విక భావంతో సహనశీలతతో ఎన్నో సేవలను స్త్రీ శిశు వృద్ధులకు అందిస్తున్నారు. తనలాగా తోటి స్త్రీలు కూడా సౌమనస్యం పూనికతో ఓర్మితో తమ సమస్యలను పరిష్కరించుకోవాలనే సుగుణమణి గారి ప్రబోధం. సందేశం కూడా.

***

> *"Introspection is a good thing. It helps us to correct the mistakes we might have committed and to get to the right path. I regard my sonscience as my guru."*
> *- Durgabai Deshmukh*


కె. సుబ్బాయమ్మ

# అమృతవర్షిణి

సుగుణాల సేవామణి,
అమృతవర్షిణి సుగుణమణి మృదు మధుర భాషిణి. మాతృశ్రీ సుగుణమణి ఆలనా పాలనా మాకందరికి అందించిన అమృతమూర్తి. అభాగినులకు తన అమృత హస్తమును అందించిన కరుణామూర్తి. దుర్గాబాయి గారి సేవకు ప్రతినిధియై నిలచి స్త్రీలను, కష్టనష్టముల నుంచి కాపాడిన సేవాపరాయణురాలు.

వాత్సల్యమూర్తియైన ఆమె ఉదారహృదయముతో నాకు ఆంధ్రమహిళాసభలో ఉచిత విద్యావకాశము కల్పించిన సుగుణమణిగారు ఏ అండదండలులేని నాకు ఆనాటి ఆ సహాయము నన్నొక ఆదర్శ ఉపాధ్యాయినిగా మలచుట మాత్రమే కాక నా సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి దోహదము చేసినది. ఆదరణ ఆమెలోని గొప్ప గుణము.

పరిశీలించగా వారి కొండంత అభిమానమును పొందుటయే నా పూర్వజన్మ సుకృతము. నోరార సుబ్బాయమ్మా అని పిలిచి పిల్లలను రేడియోప్రోగ్రాములకు తయారుచేయమని నన్నొక రచయిత్రిని చేశారు. నిజముగా నేనొక రచయిత్రినని భ్రమపడి, నాటికలు, ఉపన్యాసాలు వ్రాసి, పిల్లలచేత అభ్యాసం చేయించేదానిని. అది చూసి "అబ్బో బ్రహ్మాండంగావుంది" అని ప్రోత్సహించే వారు, మెచ్చుకునేవారు.

నిజం చెప్పాలంటే నేను ఆంధ్ర మహిళాసభ పెద్ద ఆడపడుచును. నేను కండెన్సుడు కోర్సు పూర్తి చేసుకొనేలోపల హైదరాబాదు ఆంధ్ర మహిళాసభలో బేసిక్ ట్రైనింగ్ ప్రారంభించారు. నేను ట్రైనింగ్‌లో చేరుతాను అని అనగానే సుగుణమణిగారు సంతోషంగా చేరుమని అన్నారు. ఆ పిలుపే నాలో దాగివున్న కళాత్మక శక్తిని వెలికి తీసి పరిమళింపచేసింది. అటు పిమ్మట మా సుగుణమణిగారు మన పాఠశాలలో ఉద్యోగ

మున్నది అప్లై చేయమన్నారు. అంతేకాకుండా
నీకు కాకపోతే, ఆ ఉద్యోగము మరెవరికిస్తారని
ప్రోత్సహించారు. అదే రకముగా ఉద్యోగమిచ్చి
జీవితాన్ని నిలబెట్టారు. ఆ తరువాత మా
ఆంధ్రమహిళాసభలో ఈవెనింగ్ కాలేజి
ప్రారంభిస్తున్నట్లు తెలిసింది. వెంటనే మా
సుగుణమణి గారి దగ్గరకు పరుగెత్తి సాయంత్రపు
కళాశాలలో పి.యు.సి. చదువుతానన్నాను.
అప్పుడు "ఓ భేషుగ్గా చేరు, నీ క్షేమమే నా
ధ్యేయము" అన్నారు. అలా పి.యు.సి., బి.ఏ. పూర్తి
చేసి డిగ్రీ సంపాదించాను. మా మేష్టారు
నారాయణమూర్తిగారు చిల్లరంతా పోగుచేసికొని
నోటు తయారు చేసుకున్నావమ్మా అన్నారు. అటు
పిమ్మట బి.ఇడి కోర్సు ప్రారంభిస్తున్నట్లు తెలిసి
వెళ్ళి అడిగాను. శ్రీమతి సుగుణమణి గారు మొదటి
సీటు నీకే. మేము సెలవు ఇస్తాము, గవర్నమెంటు
జీతమిస్తుంది అన్నారు. పైన చదివిన చదువంతా
నయాపైస ఖర్చులేకుండా అనేక పారితోషికాలతో
ముగించాను. ఇంకేముంది మా పాఠశాల

అసిస్టెంటుగా, స్టాఫ్ సెక్రెటరీగా, పెద్దల కనుసన్నులలో అనేక విషయములలో అనుభవాలు సంపాదించాను. అందుకనే మా సుగుణమణిగారు నన్ను ఆంధ్ర మహిళాసభ పెద్ద ఆడపడుచని పదిమందిలో చెప్పి గౌరవిస్తూంటారు. ఇంతటి ఉన్నత గౌరవానికి కారణము శ్రీమతి సుగుణమణి గారు నాలో వెలిగించిన విద్యాజ్యోతియే. మరొక విషయము మర్చి పోయానండోయ్ నా ఉద్యోగ వివరాలు అన్నీవిని, మావారు తమంతట తాముగా వచ్చి నన్ను కాపురానికి రమ్మని పిలిచారు. శ్రీమతి సుగుణమణిగారు వెంటనే నీకు సెలవిస్తాము. నీ కాపురము నీవు నిలబెట్టుకో. ఆడదానికి భర్త సేవయే ముఖ్యమని మరిచిపోవద్దు అన్నారు. అంతే వెంటనే వెళ్ళి అన్నిటిని నాకు అనుకూలంగా మార్చుకున్నాను. ఇద్దరు పిల్లలు పుట్టారు. తిరిగి దురదృష్టము నన్ను వెంటాడి పాప చనిపోయింది. బాబు ఇప్పుడు ఆమెరికాలో ఇంజనీరింగ్ చేసి ఉద్యోగాన్వేషణలో ఉన్నాడు.

ఒకసారి మా పాఠశాల నూతన భవన ప్రారంభ సమయంలో పిల్లలందరికి భోజనము పెట్టిస్తే బాగుండును అన్న ఆలోచనను సుగుణమణిగారి ముందుంచాను. ఓ భేషుగ్గా ఉంటుందని భుజము తట్టి తక్షణమే ఆచరణలో పెట్టుమన్నారు. అంతే! ధైర్యంతో 1000 మంది పిల్లలకు భోజనము పెట్టించి వారి మెప్పును పొందాను. ఇది వారి మాతృవాత్సల్యానికి నిదర్శనము.

మా పాఠశాలకు రాగానే ఏదీ సుబ్బాయమ్మను పిలవండి అని పిలిచి అప్పటికప్పుడు ఉపన్యసించమనేవారు. అంతే నెనొక పెద్ద వక్తననుకొని ఉపన్యసించేదానిని. ఇలా ఆ మాతృమూర్తి శ్రీమతి సుగుణమణిగారు నాలాంటి వారు మరెందరినో సేవా మణులుగా తీర్చిదిద్దారు. ఇప్పుడు నేను మా అలకాపురిలో శ్రీ శారదాదేవి మహిళా మండలి స్థాపించుకొని సెక్రటరీగా సేవలందిస్తున్నాను. మరొక జన్మఉంటే

సుగుణమణిగారి కడుపున జన్మించి, ఋణవిముక్తురాలిని చేయమని ఆ భగవంతుణ్ని ప్రార్థిస్తున్నాను. శ్రీమతి సుగుణమణిగారి సహస్ర పూర్ణ చంద్ర దర్శన సందర్భములో పెద్దలందరితోపాటు నన్ను కూడ వారింటికి పిలిచి పసుపు కుంకుమల నిచ్చి ఆదరించారు. ఏ పాదము కిందో నలిగిపోవలసిన నన్ను ఒక రచయిత్రిగా, వక్తగా, దర్శకురాలుగా, అన్నిటికంటే ముందు ఒక సేవకురాలిగా తీర్చిదిద్దిన ఘనత వారిదే.

ఇలా ఎంతో మంది జీవితాలలో జీవన జ్యోతులు వెలిగించిన అమృత వర్షిణి ఆమె. నా ఉద్దేశంలో వారి ఉదారహృదయమునకు అమృతవర్షిణి అను పదము ఇంకా చాలా చిన్నదనిపిస్తుంది. శతవర్షములు వారు ఇలాగే సేవామూర్తిగా ఉండాలని నా ఆకాంక్ష.

***

> *"It is the good education that really measures work of a person".*
>
> *- Durgabai Deshmukh*



యం.శమంతకమణి

# నా స్మృతి పథంలో శ్రీమతి సుగుణమణి

కొందరు తీరికవేళల్లో సాంఘిక సేవ చేస్తుంటారు. మరి కొందరు తీరిక కలుగ చేసుకొని సాంఘిక సేవా కార్యక్రమాల్లో పాల్గొంటూ వారి సమయాన్ని సద్వినియోగం చేసుకుంటారు. ఇంకొందరు సాంఘిక సేవే తమ ఊపిరిగా చేసుకొని జీవితాన్ని ధన్యం చేసుకుంటారు. సాంఘికాభ్యుదయానికి అందునా మహిళాభ్యుదయానికి తన జీవితాన్ని అంకితం చేసి ఎంతోమంది మహిళలకు జీవనాన్ని చూపిన ధన్యజీవి మన దుర్గాబాయమ్మగారు. వారి మనస్సుని అర్థం చేసుకొని వారి ఆశయాలనే తన ఆశయాలుగా మలచుకొని ఆంధ్రమహిళాసభ అభివృద్ధే, మహిళాభ్యుదయమే తన జీవితలక్ష్యంగా చేసుకొని తన జీవితకాలాన్ని సద్వినియోగం చేసుకున్న ధన్యజీవి మన సుగుణమణిగారు.

1963లో నేను ఆంధ్రమహిళాసభలో అడుగు పెట్టాను. అప్పుడే దుర్గాబాయమ్మగారి సరసన నడుస్తూ ఆమె తలపెట్టే ప్రతి కార్యక్రమంలో తానై నిలుస్తూ విసుగూ విరామం లేక మహిళాసభ అభ్యుదయానికి రాత్రింబవళ్ళు కష్టపడుతూ ప్రతి రోజూ ప్రతి పనిగా తన పని చేసుకుపోతూ సభాప్రాంగణంలో నడయాడే నిరాడంబర మూర్తే శ్రీమతి సుగుణమణిగారు.

దుర్గాబాయమ్మగారి మాటలో ధైర్యం వుంది. సుగుణమణిగారి మాటలో ఆత్మస్థైర్యం వుంది. వారు మహాశక్తి. వీరు తన శ్రమశక్తితో దేన్నైనా సాధించాలనే పట్టుదలగల వ్యక్తి. సుగుణమణిగారిలో వున్న స్వచ్ఛత నిరాడంబరత నిస్వార్థసేవ ఆ సాదాసీదా తెలుగుతనం ఎవరినైనా తనతో కలుపుకుపోయే మనస్తత్వం అందర్నీ ఆమె దగ్గరకు చేరుస్తాయి.

ఆంధ్రమహిళాసభ ఆణిముత్యం సుగుణమణి గారు. వారు సభకు అనుంగు ఆడపడుచు. నాకు

తెలిసిన ఈ 40 సం॥కాలంలో ఆనాటి నుంచి ఈ నాటి వరకూ ఆమె దైనందిన కార్యక్రమం సభకు రావడంతోనే ప్రారంభమవుతుంది. ఆమె అధ్యక్షతన ఎన్నో సభలూ సమావేశాలు జరిగాయి. సభలో ఏ కార్యక్రమమూ ఆమె లేకుండా జరగలేదు. ఆ కార్యక్రమంలో తొలిపలుకులుగాని తుదిపలుకులుగాని ఆమెవే. ఆమె లేని సభలో జవజీవాలుండవు, జనరంజకం కాదు. సభ ఆవిర్భావానికి ఆరంభం నుంచి వారు పడిన శ్రమను, వారు సాధించిన ప్రగతిని సభికులకు స్వచ్ఛమైన తెలుగులో స్పష్టంగా చెబుతూ ఈనాటి సభ దినదిన ప్రవర్ధమానంగా ఎలా ఎదుగుతూ వచ్చిందో సభాసదులకు వివరించడం ఒక్క సుగుణమణిగారి వల్లనే సాధ్యం. మహిళాసభ అనే వటవృక్షం శాఖోపశాఖలుగా విస్తరించడానికి కారణభూతులైన మహావ్యక్తులను గురించి ఈనాటి వారికి తెలియచెప్పకపోతే, ఎందరో అభాగ్యజీవుల జీవితాలలో వెలుగుని నింపి చల్లని నీడనిస్తున్న

ఈ మహావృక్షాన్ని ఈ తరంవారు పనికిరాని వృక్షంగా తలచి తాము కూర్చున్న కొమ్మని తామే నరుక్కునే ప్రమాద ముంటుందని అనిపిస్తుంది. జరిగిన చరిత్ర తెలిస్తేనే జరుగుతున్న చరిత్రకు విలువుంటుందని జీవితపు విలువలను తెలియచెప్పే తపస్వి సుగుణమణిగారు.

సుగుణమణిగారు అచ్చమయిన తెలుగు మహిళ. ఆమె స్వరూపంలో కట్టుబొట్టులో తెలుగు తనముంటుంది. ఆమె మాటల నడకలో నడతలో తెలుగుతనం ఉట్టిపడుతుంది. తెలుగు సంప్రదాయాల పట్ల, మన సంస్కృతి నాగరికత పట్ల ఎంతో నమ్మకముంది. ఆమె ఏ సభలోనైనా ఆదరపూర్వకంగా అందర్నీ ఆహ్వానించడం చూస్తే ఉత్తమ గృహిణి సంప్రదాయం, ఆప్యాయత ఉట్టిపడుతున్నట్లు అనిపిస్తుంది. కాకినాడ కాలేజీలో డిగ్రీ చదివినా శ్రీరఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యురాలైనా దేశ విదేశ ప్రముఖులు ఎందరు హాజరైన సభలోనైనా మధురస్వరంతో

తాను చెప్పదలచుకున్న అంశాన్ని తాపీగా స్పష్టంగా సరళమైన మాతృభాష అయిన తెలుగుభాషలో సూటిగా సభా సదులకు వివరించడం వారిలోనే చూచాను నేను.

అందరి యెడా మాతృభావం, అందరి అభిప్రాయాలనూ మన్నించడం, నిరంతరం శ్రమించడం ఆమె తత్వం. ఇతరుల సంతోషాన్ని కోరుకోవడం ఏ పనిచేసినా తాను నమ్మిన కార్యాన్ని వెనుదిరిగి చూడకుండా ధైర్యంగా పని సాధించడం ఆమె సహజ గుణాలు అనిపిస్తుంది. ఏ వ్యాపకంలోనైనా నేను నాతోటివారికి ఎలా ఉపయోగపడగలను? నాకున్న అవకాశాన్ని ఉపయోగించి ఇతరులకు ఏ విధంగా ఉపయోగపడగలను? అని ఆమె ఆ దృష్టితో తన జీవితాన్ని మలచుకున్నారు. అందుకే ఆమె ఆంధ్రమహిళాసభ విద్యాసంస్థల సెక్రటరీగా అడుగుపెట్టి, మహిళాసభ అధ్యక్షురాలుగా ఎదిగారు. ఆంధ్రమహిళాసభకు మహిళలు మాత్రమే

అధ్యక్షులుగా కావాలని ధైర్యంగా నలుగురికీ చాటి చెప్పి మహిళల శక్తియుక్తులను చాటి చూపించారు. మహిళాసభను స్థాపించిన దుర్గాబాయమ్మగారి జీవితాశయాలకు తానే వారసురాలై నిలవగలిగారు.

సంగుణవంణి గారి సాంఘింక సేవ ఆంధ్ర మహిళాసభలో ఆరంభం కాలేదు. పువ్వుపుట్టగానే పరిమళిస్తుందన్నట్లు ఆమె బాల్యం నుంచే ప్రారంభమయింది. గృహిణిగా స్థిరపడిన తరువాత కలకత్తాలో ఏర్పడిన కరువు పరిస్థితిలో కరువు బాధితులకు తన శక్తివంచన లేకుండా ఎంతో శ్రమదానాలు చేసి ఆదుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో అరకులోయలో ఆటవికుల కష్టసుఖాలను తెలుసుకొని తనను వారు కలకాలం తలచుకునేట్లు ఎన్నో సేవా కార్యక్రమాలు చేశారు. ఇక మాతృసంస్థయైన ఆంధ్రమహిళాసభలో అనునిత్యం ఆమె చేసే సేవాకార్యక్రమాలు రాష్ట్రమూ దేశమూ కూడా గుర్తించాయి. ప్రముఖ సంఘసేవికురాలుగా ఆమెకు ఎన్నో సన్మానాలు సత్కారాలు లభించాయి.

జంట నగరాలలో ప్రముఖ సంఘ సేవికురాలుగానే కాకుండా మన రాష్ట్రపతిగారి నుంచి కూడా అవార్డును పొందారు. సేవ చెయ్యాలనే మనస్సు వుంటే చాలు వయస్సు ఏమాత్రం ఆటంకంకాదు అని 80 సం॥ దాటిన వయస్సులో కూడా అసామాన్యమైన సంఘసేవచేయడం నిజంగా ఆ అనురాగమూర్తికే చెల్లిందనిపిస్తుంది.

ఆంధ్రమహిళాసభ స్కూలుకి సుగుణమణి గారు చేసిన సేవ అసమానం. సభలో ఉన్న అన్ని సంస్థలకంటే స్కూలుపై ఆమెకు మమకారం ఎక్కువ. అందులో పనిచేసే మేము ఆమెకు ముద్దుబిడ్డలం. స్కూలు బిల్డింగు కట్టడానికి కావలసిన స్థలసేకరణ అనువైన అందమైన చక్కని బిల్డింగు కట్టడానికి కావలసిన నిధి సేకరణకు ఆమె నడుం కట్టారు. శాశ్వత గుర్తింపు తెప్పించడానికి కారణభూతురాలు కూడా వారే. స్కూలు మంచి చెడులను సదా పట్టించుకోవడం

ఆమెకిష్టమయితే ఆమెను మా మాతృదేవతగా మన్నించడం మాకిష్టం.

నా స్మృతి పథంలో ఈ నలభై ఏళ్ళ జీవితాన్ని తలచుకుంటే నా అనుభవాలలోని శాశ్వత విలువలు సుగుణమణిగారి వంటి పెద్దల ద్వారా సంక్రమించినవే. ఆమె మా పై చూపించే అపేక్ష, ప్రేమ వయస్సుతో పాటు పెరుగుతూనే వచ్చాయి. ఆంధ్రమహిళాసభ సభ్యులందరూ సమష్టి కుటుంబంగా మెలగడానికి వారు నేర్పిన మానవత్వం మానవ విలువలే కారణం. ఎన్నో సంస్థలు లెక్కకు మించి పుట్టడం రోజులు లెక్కించకుండా కనుమరుగైపోవడం మన కళ్ళతో మనం చూస్తూనే వున్నాం. కాని ఆంధ్ర మహిళా సభ స్థాపన రోజు నుంచి ఈ రోజు వరకు దినదిన ప్రవర్ధ మాన మవుతూనే వుంది. దీనికి కారణం ఈ మమతామూర్తుల నిరంతర శ్రమయే.

మనదేశంలో మహిళలు మానసికంగా ఇంకా ఎంతో ఎదగాలని, ఏదన్నా అనుకొని ఆచరణలో

పెట్టే స్వాతంత్ర్యం వారికి వుండాలని, అటువంటి సామాజిక వాతావరణం కలిగించాలని, సుగుణమణిగారి పట్టుదల. స్త్రీకి ఆర్థిక ఆలంబన చూపగలగితే మానసిక స్థైర్యం ఆమెకే వస్తుందని వీరి అభిప్రాయం. అందుకే ఆమె దాతల దగ్గర ఎన్నో విరాళాలు సంపాదించి సభలో వారికి ఆర్థిక ఆలంబన కలిగించడానికి అవిరళకృషి చేశారు. సంఘానికి మనం ఏమి చెయ్యగలమని నిశ్శబ్దంగా బతికే సగటు మనిషికి, సుగుణమణిగారి జీవన శైలే శక్తిని స్ఫూర్తినీ ఇస్తుందని నా ప్రగాఢ విశ్వాసం. నా స్మృతి పథంలో సుగుణమణి గారి స్థానం సుస్థిరంగా ఇప్పటికి ఎప్పటికీ నిలచి వుంటుంది.

స్వయంశక్తిని నమ్ముకొని, ప్రణాళికా బద్ధంగా కాలం విలువ తెలుసుకొని ఒక అంకిత భావంతో ఏ పనినైనా సాధించవచ్చని సుగుణమణిగారి జీవితాన్ని పరిశీలిస్తే మనం తప్పక నమ్మవలసి వస్తుంది. వారి జీవితం తెరిచిన పుస్తకం. ప్రతి పుటలోనూ ప్రతి జీవితాంశంలోనూ ఆమెలో కష్టపడే

గుణం పనిపట్ల మాత్రమే కాకుండా మనుష్యుల పట్ల విశ్వాసం, మనిషిగా ఎదగడానికి కావలసిన నైపుణ్యం పోటీతత్వం కనిపిస్తాయి. నిజానికి మాలాటి సగటు జీవులకు గమ్యాన్ని ఏర్పరచుకునే శక్తియుక్తులను వీరి ద్వారానే పొంది మన ప్రగతికి కూడా మనం మంచి బాటలను వేసుకోవచ్చని నా విశ్వాసం.



*"Human beings are not immortal but Institutions are permanent. It is this conviction on my part that helped me always in my search for talent in building up a second line of young workers. I have also held that honest and sincere workers are the back bone of any country or any institution. I further believe that while one honest, sincere and efficient worker would create millions or billions of rupees, no millians and billions of rupees could create an honest, sincere and devoted worker."*

*- Durgabai Deshmukh*



యున్నం మాలకొండయ్య

# దివ్యజ్యోతి సుగుణమణి

సుజనమణి సుగుణమణి
సేవామణి సుగుణమణి
అమృత వర్షిణి సుగుణమణి
అమృత భాషిణి సుగుణమణి

నిగర్వి
నిరాడంబర జీవి
నిస్వార్థపరులు
నిజాయితీ పరులు సుగుణమణి

స్త్రీ జనాభ్యుదయానికే
జీవితాన్నర్పించిన దివ్యజ్యోతి
స్త్రీల కన్నీటిని తుడిచి పన్నీటిని పంచే పుణ్యవతి
అజాత శత్రు తేజోవతి
ఆంధ్ర మహిళల పాలిట అవతరించిన
దేవతామణి సుగుణమణి

వినయంతో కూడిన మాట
అడ్డు ఆటంకం లేని బాట

ఆత్మ విశ్వాసమే ఆమెకు అండ
సేవాతత్పరతే ఆమె ధ్యేయం

విరామం అంటే చిరాకు ఎవరికి?
అలుపు సొలుపు ఎరుగని వారు ఎవరు?
పగలు రేయికి తేడా తెలియనిది ఎవరికి?
వృద్ధాప్యం అంటే ఎరుగని వారు ఎవరు?

ఇంకెవరు మహిళామణి సుగుణమణి



# GANDHI VEDIKA INAUGURATED

Hyderabad, Oct, 3

'Gandhi Vedika' an open air auditorium constructed in the campus of the Andhra Mahila Sabha Vidyanagar, was declared open by Mrs. K. Sugunamani, a veteran social worker and member of the Mahila Sabha Trust Board, Yesterday.

Dr. Mrs. Durgabai Deshmukh, Founder-President of the Andhra Mahila Sabha, introducing Mrs. K. Sugunamani, referred to her dedicated and devoted social service spread over a period of thirty years.

Mrs. Durgabai Deshmukh said Mrs. K. Sugunamani imbided all the virtues and ideals such as simplicity, selfless service, adherence to truth and non-violence preached and practiced by Gandhiji and carried them out in her own life with missionary zeal. "It is but appropriate that the auditorium named after Gandhiji the apostleof peace, truth and non-violence should be inaugurated by a person who cherished and practiced all those virtues", she added.

Mrs. Sugunamani, inaugurating the auditorium, said that she was aware of her limitations, and accepted the honour in humility with all the responsibility it carried.

The auditorium has been constructed for holding meeting and cultural programmes bearing on Gandhiji's life and work.

The distinguished gathering included Dr.C.D.Deshmukh, and Mr. Tallapragada Prakasarayudu, the Veteran Congress and social worker.

The function concluded with the singing of the National Anthem.

-*The Deccan Chronicle, Oct. 4.1972*

# Homage to Sri Bhushanam

*- B. V. D. Narayan Rao*

Sri Kancharla Bhushanam, one of our dearest friends and a stalwart of the Andhra Mahila Sabha has passed away on the 30th September, 1976. Those that God loves most are the first in the race to reach His lotus feet.

Bhushan as he was endearingly called by all who knew his sterling character was an eminent agricultural scientist who made a name for himself in Agricultural Rearch Institute, Pusa. At the request of Dr. B.V. Nath he transferred his services to the Government of Madras some time in the 1940s; the old issues of *'Padi-Panta'* which he produced as an officer in the department of agriculture serve even today as material worthy of reference and study.



He was a scientist to the core; he was fond of weaving interesting stories and explaining to the childern how waves are formed, how lightening occurs and how eclipses shadow the moon and sun. With great effort and cost he manipulated the telescope with minimum of imported parts, and on many a moonlit nights on the terrace of our Hostel building he explained to the students the mysteries of the Universe and how the hidden hand of God moves the planets round and round in regular clock work motion.

This simple man had never sipped Coffee or Tea,nor touched tobacco, nor ever had but Khadi on his mortal frame - this man, with discipline harder than steel and - without the weakness of human mercy, passed away. Alas his footsteps into the Gandhi park of our Sabha are never more to be or seen or heard.

Gandhiji or Kasturba - whose suffering for the sake of principles was more excruciating ? The man who was steadfast in discipline or his wife who could never swerve from his path? For Smt. K. Sugunamani, wife of Sri Bhushanam, who bore with great cheer and courage the partnership with her husband and never swerved from the line that her

husband chalked out for her as a way of life, we have the greatest admiration. To Smt.KSugunamani one of our Trustees, who built our Mahila Vidyalaya we offer our heartfelt condolences with the assurance that the Andhra Mahila Sabha would stand by her in her bereavement and do what all is possible to help her in developing the institution she has built. Work, work is the most potent antidote to sorrow. Only this advice we can offer to our daughter Sugunamani in her bereavement.

- Courtesy : *Vijaya Durga*, October 1976, Andhra Mahila Sabha monthly.





*Receiving National Award*
*from*
*Rashtrapati R. Venkataraman*
*1992*

*Honoured by*



N.T. Rama Rao
Chief Minister A.P.



N. Chandrababu Naidu
Chief Minister A.P.



యల్లాప్రగడ సీతాకుమారి

శీలే మానం భవతి
శీలాంబు:
పురుషశ్శీలేంద్రియే
ప్రతితిష్ఠతి

---

# ప్రశంస

శతవసంతాలు పృథ్విపై
శాశ్వతముగ
శుభములను బొంది కీర్తిసత్
సుఖములంది
సంఘసేవ [illegible] దేశసేవ [illegible]
చరించు
దివ్యగుణావళుల మణివి సే
ద్సుగణామణివి
నీకే భగవంతుడిడు గాక
నిత్యో జయము !

మీ సోదరి
విద్వాన్ ఆర్. సీతాకుమారి
27.11.82.



*Distributing Rice to the Beneficiaries of Sericulture Training Programe organised by Andhra Mahila Sabha at Ibrahimpatnam, R.R. Dist.*



*Sugunamani at Laying Foundation at AMS Academic Campus*



ఆంధ్ర మహిళా సభ స్వర్ణోత్సవ సభ 1983 కుముద్బెన్ జోషిచే సుగుణమణి సత్కారం,
వేదికపై భారత ప్రధాని రాజీవ్ గాంధీ మరియు తమిళనాడు మంత్రి నేడుంజరియన్



Address by K. Sugunamani at Andhra Balaananda Sangham, Hyderabad. Nyapati Kameswari and Nyapati Raghava Rao are also seen in the picture




*Foundation Stone Laid by K. Sugunamani*



## Worth of A Dedicated Worker

"I firmly believe that millions and billions of rupees cannot create what sincere, honest and devoted workers can. Millions and billions come running after a devoted worker. That is why I believe that dedicated workers are the backbone of an institution or a country."

*Dr. Durgabai Deshmukh*



Gandhi Sathabdi Bhavan, 1972